# లక్షణచంద్రిక.

ఇది

గుడివాడతాలూకా గుడ్లవల్లేరు గ్రామవాస్తవ్యుఁడును,

జ్ఞానవతీ ప్రముఖ గ్రంథకర్తయు

నగు

చిల్లరిగె యోగానందకవిచే

రచింపఁబడి ప్రకటింపఁబడెను.

అంగలూరు గ్రామనివాసి

తిపిర్నేని రం॥ రామయ్యగారి

ధనసహాయమున


బెజవాడ, వాణీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1914.




వెల 0—4—0

# ప్రకటనలు.

(1) జ్ఞానవతి:—ఇది 1100 పద్యములుగల నవల. పద్యములనుటయేగాని గద్యముకన్న సులభశైలి. అక్షరజ్ఞానమున్నవారికందఱకు నర్థమగును. మనదేశమందు మున్ను జరగిన పతివ్రతాచరిత్రము ఇదెవ్వరును వ్రాసియుండలేదు. వెల రు 0—14—0

(2) లక్షణచంద్రిక:—కవిత్వము నేర్చుకొనువారికిదిముఖదర్పణము. సంస్కృతసంధులందెల్పుటకు దేవగురువు. హైస్కూల్విద్యార్థులకు ప్రత్యక్షకామధేనువు. వెల 0—4—0

వ. రా:—పైరెంటిని కలిపికొన్నప్డు వెల రు 1—0—0

(3) బాలశతకము:—ఏడాదిలో రెండుకూర్పులుపడ్డది ప్రైమరీవిద్యార్థియొక్క సుస్తధర్మములు తెల్పు కందశతకము వెల 0—2—0

(4) శ్రీమద్రామయణాద్భుతోత్తరకాండము:—వాల్మీకివిరచిత సంస్కృతంబు: కాంధ్రీకరణము. మనోహరశైలి. చదివితీరవలెను వెల 1—4—0

వ. రా:—అన్నిటికి పోష్టుఖర్చులు వేఱు.

☞ వలయువారు:—చిల్లరిగె యోగానందయ్య పంతులు, గుడ్లవల్లేరు, కవుతరంపోష్టు, కృష్ణాజిల్లా.



# లక్షణచంద్రిక.

ఆ॥ వె॥ ఆంధ్రదేశమందు - నావిర్భవించి, మీ
రాంధ్రజాతికీర్తి - నందియుండి
యాంధ్రభాష తెలియ - దన్న చోనవ్వరే !
గనుకఁ దెలుఁగు నేర్వఁ - గడఁగుఁడయ్య! ॥

ఏకారణముననో బాల్యమునుండియు నాంధ్రభాష నభ్య సింపని మనవార నేకులున్నారు. కొందఱు సామాన్యజ్ఞానమొం దినవారయ్యు నభివృద్ధిచేసికొనకుండిరి. మాతృభాషాభిమాను లకది లక్షణమేనా! మఱికొందఱు వయస్సుమించినదనియు నీయీడున నొకరియొద్ద చదువుటకు సిగ్గగుచున్న దనియు నిరా శనొందుచున్నారు. విద్యార్థులకట్టిదురభిమానము పురోభివృద్ధి కి భంగముకలిగించును. ఇందులకు నాయనుభవసిద్ధమైన విష యమొండుచెప్పెదవినుండు. సంపూర్ణలోకజ్ఞానమును, సా ధారణ భాషాజ్ఞానమునుగలవారు ముందుగా ఛందశ్శాస్త్రము నలవడుట భాషాభివృద్ధికిమూలము. ఎట్లందు రేని; "కరికరము, కవికలము నెప్పుడు నూరకుండ" వన్నట్లు లక్షణమెఱిఁగినవారే వ్రా కొన్ని పద్దెములల్లుచు నేయుందురు. అప్పుడ నేకసందే హములుగల్గును. తన్నివారణార్థము మేధావులైనవారు స్వ

యముగాను, గానిచో గురుముఖతగాను దదవసరగ్రంథావలోకనంబునకు దొరకొందురు. అప్పటికిఁగదా "దేశభాషలందుఁ - దెనుఁగులెస్స" యనుసామెత వారికి విశదమవును! తేనెను దేనెటీఁగమాడ్కి శబ్దజాలంబు నట్టివారు గ్రహింపకమానరు. ఇంతకన్న నట్టివారిని బాగుపఱుచు నుపాయంబు వేఱొండులేదు.

అట్టివారికి ముందుగా "సులక్షణసార"మను గ్రంథము మహారణ్యమువలెఁదోఁచును. కావున నేను విద్యార్థులకుఁజెప్పుచుండుచోఁ జెప్పిన క్లుప్తపఱిచి యిందు వ్రాయఁబూనితి. మఱియు ముఖ్యముగా వాడఁబడు సంస్కృతసంధులంగూడఁ గొన్నింటి నగపఱుచువాఁడ. హైస్కూళ్లవిద్యార్థులకును నిది బహుసహాయకారి యగును. మందబుద్ధు లింతమాత్రముననే పాండితీవిశేషమార్జింపఁజాలకపోయినను వృత్తలక్షణలోపముల నెఱుంగుటయుఁ బద్యములను సులువుగ జ్ఞప్తియందుంచుకొనుటయు మున్నగు స్వల్పలాభంబులనైనఁ బొందకపోరు.

౧ గురులఘ్వక్షరప్రకరణము.

"గురువు" అనఁగా గొప్పదియని యొకయర్థము. ఈ శాస్త్రమందా కారణముంబట్టియేగాక యుచ్చారణావధిం బట్టి కూడఁ దీసికోఁబడెను. లఘువర్ణోచ్చారణకాలమునకు రెట్టింపుకాలము గురూచ్చారణకుఁబట్టు; గాన రెండులఘువు లొక గురువగునని యెంచునది. (1) దీర్ఘాచ్చులు (ఆ, ఈ, ఊ, ౠ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ) ను, దీర్ఘాచ్చులుగల హల్లులును (2) పదమందుఁ బూర్ణానుస్వారవిసర్గములుగల వర్ణంబులును (3) ఏకపదములోని సంయుక్తాక్షరమునకుఁ (అనఁగా రెండుహల్లు

లు గలసిన వర్ణమునకు) బూర్వమందున్న యక్షరాలును గు
రువులౌను.

II "లఘువు" అనఁగాఁ జుల్కఁగాఁ బల్కఁబడునది.
(1) హ్రస్వాచ్చులును (అ, ఇ, ఉ, ఋ, ఌ, ఎ, ఒ) (2) హ్ర
స్వములతోఁ గూడిన హల్లులును లఘువులనంబడును.

షరా:— గురువునకు 'గ' యనియు, లఘువునకు 'ల'
యనియు గుర్తులు.

## ౨ గణప్రకరణము.

"గణము" అన నీశాస్త్రమందు సాధారణముగా మూ
డక్షరములు.

(1) భగణము:—ఆదిగురువుగలది. అనఁగా మొదటియక్షరము గురువుగాను, మిగిలినరెండును లఘువులుగాను నుండునది. ఉదా:—రాముఁడు, విష్ణువు, శంభుఁడు మొ॥

(2) జగణము:-మధ్యగురువు. ఉదా:-కరాసి, మరుత్తు, విరించి

(3) సగణము:-అంత్యగురువు. ఉదా:-అవురా, ఇలపై, వనముల్

(4) యగణము:-ఆదిలఘువు. ఉదా:-కరమ్మున్, శరాగ్ని, విషంబే

(5) రగణము:-మధ్యలఘువు. ఉదా:-భీముఁడా, భాంకృతుల్, శారదా.

(6) తగణము:-అంత్యలఘువు. ఉదా:-ఏమాయె, నామీఁద, నీభూమి.

(7) మగణము:-మూడునుగురువులు. ఉదా:-రారోరీ, నాగేశా, వేగంబే

(8) నగణము:- మూడునులఘువులు. ఉదా:-వఱద, మునువు, వినవె

(9) వగణము:-లఘువుపైగురువు. ఉదా:-బలే, నజిన్, చుమీా

(10) హగణము:-గురువుపైలఘువు.ఉదా:-మాట, గిట్టు, పుచ్చె

ప రా:—తుదిగణాలు రెండును రెండేసి యక్షరాలుగల వి. వీనికీవరుసఁగ "లగము, గలము" అనియుఁబేళ్లు. నగణము పైని గురువువచ్చిన "నగము" అనియు, లఘువు వచ్చినచో "నల" మనియు నిట్లే యాయాగణములకుఁ బేరులువచ్చును.

కం॥ నల, నగ, సల, భ, ర, తలఁనా
నెలమినిసీయాఱుగణము - లింద్రగణమ్ముల్
గల, నగణము లీరెండును
జలజాప్తగణాంబులంద్రు - సరసిజనాభా॥

ప రా:—1 నలము, (నగణముమీఁదలఘువు) 2 నగము, (నగణముపైనిగురువు) 3 సలము, (సగణముమీఁదలఘువు) 4 భ, (భగణము) 5 ర, (రగణము) 6 త, (తగణము); ఇవి యింద్రగణములనంబడు. 1 గలము,(గురువుపైనిలఘువు = హగణము) 2 నగణము; ఇవి సూర్యగణాలు.

3 యతిప్రకరణము.

'యతి' అనఁగాఁ బద్యపాదప్రారంభాక్షరమునకు నియమప్రకారమువచ్చునట్టి యక్షరము. అక్షరము లచ్చులనియు ("అ,ఆ" మొదలు "ఔ" వఱకు) హల్లులనియు ('క,ఖ' మొదలుకొని యన్నియు) రెండువిధాలుగదా. అచ్చులు ప్రాణులనియు (పలుకఁబడునవి) హల్లులు ప్రాణములేనివనియు (పలుకఁబడనివి) నెల్లరు నెఱింగినవిషయంబే. ఇంనువలన నచ్చు

(స్వరము) లేనిదే హల్లువచింపఁబడదని తేటపడినది. ఉదా:-
'క' అనువర్ణము కకార (క్) అకార (ˇ = అ) ములు కలసి
పలుకఁబడినది. ఆకకారమే మఱొకహల్లుక్రిందికిఁ జేరునపుడు
'కావత్తు (్క)' అను మాఱురూప మొందును. "త్క" అను
దానికి వర్ణక్రమంబు నుడువుమన్నపుడు తకార, కకార, అ
కారములు (త్ + ్క + ˇ) 'త్క' అని చెప్పుదుముగదా. అప్పు
డు 'అ' యను నచ్చునకు బదులుగానే తలకట్టు (ˇ) వచ్చినద
ని తెలియకపోదు. ఇట్లే అచ్చులకును, హల్లులకును మాఱు
రూపము లెఱుఁగునది.

అచ్చులు.

అ,ఆ,ఐ,ఔ. (2) ఇ,ఈ,ఋ,ౠ,ఎ,ఏ. (3) ఉ,ఊ,ఒ,ఓ.

హల్లులు.

క,ఖ,గ,ఘ,క్ష. (2) చ,ౘ,ఛ,జ,ౙ,ఝ,శ,ష,స,క్ష. (3) ట,ఠ,డ,ఢ. (4) ణ,న. (5) త,థ,ద,ధ. (6) ప,ఫ,బ,భ,వ. (7) మ. (8) య,హ,అ,ఆ,ఐ,ఔ. (9) ర,ఱ. (10) ల,ళ.

షరా: —పైనిజూపఁబడిన అచ్చులు మూఁడురకములు
ను, హల్లులు పదిరకములును బరస్పరసంబంధముగలవి. అనఁ
గా నాయారకములలోని ప్రత్యక్షరము నొకదానికొకటి మా
ఱవచ్చును. అట్లుమాఱుచోట్లకు (నియమితస్థలములకు) యతి
స్థానములనిపేళ్లు. "క్ష" అనువర్ణములో (క్ + ష్) రెండు
హల్లులున్నవి గనుకనే కవర్గములోను, చవర్గములోను 'క్ష'
చేరినది. ఇట్లే సంయుక్తాక్షర (హల్లులురెండు, మూఁడుగ
ల) హల్లులను విడఁదీసి తత్తద్వర్ణముల రకములలో నేదేనొ
కహల్లును యతిమైత్రికిం బ్రయోగించుకొనునది. ఆఱవరకము

లోని హల్లులకు మూఁడవరకమచ్చులందేదేని (ఉ,ఊ,ఒ,ఓ) యొకటి ప్రయోగమైనప్పుడు మకారమునుగూడఁ దీసికొనందగు. ఎట్లందురా; ఉదా:—ము = పో, బు = మో. ఇంతవఱకు నిరాక్షేపణయతులు. భారతేతరగ్రంథములలో ననేకరీతులుగ యతులుగన్పట్టి వివాదహేతువులగుచున్నవి. క్వచిత్తుగ వచ్చు భారతసమ్మతయతులం గొన్నిటి నిం దుదహరింపలేదు. తెలుఁగుసంధులు వచ్చినచోట్ల నాయాస్థలములందునిల్చెడి యచ్చులే యతులకుఁజెల్లునుగాని సంధిహల్లుచెల్లదు. ఉదా:—

చం॥ రుండఁగ నాకునేమి భయ•ముగ్రరిపుప్రచయాటవీదవా॥

పైపద్యపాదము నాల్గవది. మూఁడవ పాదాంతమున 'మీ' యనువర్ణమున్నది; గనుక దానిని గల్పిచదివిన "మీరుండఁగ... (మీరు+ఉండ...)" అని యవునుగదా. కనుక నే 'ఉండ...•ఉగ్ర' అని యతియైనది. ఇట్లే శేషంబు లూహ్యంబులు. సంస్కృతసంధులందుఁగూడ నిట్లొప్పెడు. తెనుఁగునందు సంశయనిశ్చయాదుల ప్రత్యయంబులగు (అ,ఆ,ఇ,ఈ,ఎ,ఏ,ఒ,ఓ) అచ్చులను బ్రత్యేకముగఁగాని యాయాహల్లులతోఁ గలిపిగాని యతులకుపయోగింపనగు. ఉదా:—కం॥ దేనాయదియిమ్మదేవ • దేవసమానా॥ ఈపాదారంభమందలి 'దే' యను వర్ణమునకుఁ బూర్వము 'అ' యను నచ్చున్నదనుకొనుఁడు అప్పుడు "అదే" యని నిశ్చయార్థకమయినది; కనుక 'దే'యనువర్ణముగాఁదీసికొని 'దేవసమానా' యను పదములోని యాద్యక్షరమును యతికి నుపయోగింపఁబడెను. అచ్చుమాత్రమే తీసికొన్నచో "దేనాయదియిమ్మకరుణ • నింద్రసమానా" అనియుండును.

౪ ప్రాసప్రకరణము.

పద్యపాదమందలి రెండవయక్షరమునకుఁ 'ప్రాస'మని పేరు. 'ఆటవెలఁది, తేటగీతి, సీస' మను పద్యత్రయమునకుఁ బ్రాసనియమము లేదుగాని తక్కినపద్యములకుఁ గలదు. ప్రథమపాదప్రాసాక్షరమునకుఁ బూర్వము పూర్ణానుస్వారవిసర్గము లున్నను, నది ద్విత్వసంయుక్తాక్షరమైనను నట్లే పాదములన్నిం ట నుండవలయు. అచ్చులు మాఱవచ్చునుగాని హల్లులుమాత్రము మాఱరాదు. పూర్వమందు గుర్వక్షరమున్నచో గుర్వక్షరమును, లఘ్వక్షరమున్నచో లఘ్వక్షరమును సర్వపాదంబులకు నుండవలయు.

ఆటవెలఁదికిఁ, దేటగీతికి, సీసమునకుఁ బ్రాసనియతినాల్గుపాదాలకు లేదుగాని ప్రతిపాద ప్రాసాక్షరమును యతిగాఁ దీసికొని ప్రాసయతియని వాడుకొందురు. అప్పుడు పైనిజెప్పిన ప్రాసనియమములు తత్ప్రాస యతికిం జూచుకొనవలయు యతులుపయోగించుకొన్నచోఁ బ్రాస యతులనువీడవలయు. ప్రాసయతినిదీసికొన్న, యతిని వదలవలయు.

౫ వృత్తప్రకరణము.

ఎక్కువవాడుకలోనున్నవియు, నన్యోన్యసంబంధము గలవియునగు వృత్తములను సాధ్యమైనంతవఱకు సక్రమంబుగఁ జూపువాఁడ. వృత్తగణక్రమంబు నాయాపద్యపాదంబులం దెల్పువాఁడ. ఒక్కచరణంబుతోఁదెల్పినయెడల మిగిలిన మూడు పాదములట్లేయని గ్రహించునది. రెండుపాదంబులంజెప్పినపక్షమున శేషపాదద్వయంబట్లయని యూహించునది. గణములను దెలుపునపుడు దీర్ఘాక్షరముప్రాసినచో నాయక్షరసంజ్ఞగల గ

ణంబులుగాని, అక్షరములుగాని రెండని తెలిసికొనునది. ,.—,
అనుగుర్తునకుఁ బరమందు యత్యక్షరముండును. ప్రాసయతి
యైనచో నాగుర్తునకుఁబిమ్మట రెండవయక్షరముగానుండును.

ఆటవెలఁది.

ఇనగణత్రయంబు - నింద్రద్వయంబును
హంసపంచకంబు - నాటవెలఁది॥

తేటగీతి.

సూర్యుఁడొక్కండు నటుపైని - సురపతీద్వ
యంబుఁ బిమ్మటహంసద్వ-యంబుగీతి॥

వ్యా:—పఠనసౌకర్యార్థము నాలుగేసి పాదంబులు
ప్రతిపద్యమునకుఁ బూరింపఁబడునని యెఱుంగునది. ఆటవెలఁ
ది లక్షణము రెండుపాదములతో సంపూర్తి. తేటగీతిలక్షణ
ము ప్రథమచరణముల్లే మిగిలిన మూడుపాదములును; అయిన
నిచ్చట గణబోధనకై రెండుపాదంబులు వ్రాయవలసివచ్చెను.
హంసపంచకంబు = సూర్యగణములయిదు. పైరెండుపద్దెముల
కుఁ బ్రతిపాదమునకు మూడుగణములపిమ్మట యతి.

సీసము.

ఆఱింద్రగణములు-నర్కద్వయంబును + సీసపాదమున
కుఁ - జెల్లుచుండు॥

వ్యా:—మొదట రెండుగణములకుఁ బిదపయతి. మ
రల నైదవగణముయొక్క ప్రథమాక్షరమునకు నేడవగణము
లోని ప్రథమవర్ణముయతి. ఇదంతయునొక్కపాదము. తక్కి
న మూడుపాదములిట్లేపూర్తిచేసి తుదకుఁ దేటగీతినైనను ఆ
టవెలఁదినైనను నాల్గుచరణములు (ఎత్తుగీతయని దీనికిఁబేరు)

వ్రాయవలయు. అంతట సీసపద్యము సంపూర్ణమగును.

కందము.

కందము త్రి,శరగణంబుల
నందును: గా,భ,జ,స,నలము•లటవడిమూటన్
జెందును: నల,జలనాఱిట
నొందును: తుదగురువు: జగణ•ముండదు బేసిన్॥

వ.రా:—ఇదియు రెండుపాదాలకే సంపూర్తి. ప్రథమ చరణము పన్నెండులఘువులు (వీనినే యిచ్చట మాత్రలని వా డెదరు) ను, ద్వితీయచరణము ఇరువదిలఘువులును గలది. అనఁగా 1వ చరణమునకు (త్రి) 3 గణములును, 2వ చరణము నకు (శర) 5 గణాలును నుండును. ద్వితీయచరణమందలి నా ల్గవగణముయొక్క మొదటియక్షరము (వడి) యతి. ప్రథమ చరణంబునకు యతి యుండదు. గా = రెండుగురువులు. బే సిన్ = 1,3,5,7 యను గణములందు. తుదన్ = 8వగణమునం దు. 8వది సగణమో గగమో యుండవలయును. 6వ గణము జగణమో నలమో యుండవలయు.

ఉత్పలమాల.

వచ్చు(గ్రమంబుగన్ భ,ర,న•భా,ర,వ లుత్పలమాలకున్ దగన్॥

వ.రా:—యతి 10వయక్షరము. భా = రెండుభగణాలు.

చంపకమాల.

న,జ,భ,జ,జా,రలన్ శుభగ•ణమ్ములు చంపకమాలకౌసఖా॥

వ.రా:—యత్యక్షరము 11. జా = రెండుజగణములు. ఉ త్పలమాలయొక్క మొదటిగురువిందు రెండు లఘువులు చేయఁ బడె.

### మత్తేభము.

స,భ,రల్ పైఁ;న,మ,యల్ ;పదంబుతుదవన్ • సంధింపమత్తేభమా॥

వ్యా:—యతి 14. వన్ = వగణమును.

### శార్దూలము

సంధిల్లున్ మ,స,జంబులున్ స,త,త,గల్ • శార్దూలవృత్తంబునన్॥

వ్యా:—యతి 13. మత్తేభారంభలఘుద్వయంబిందు గురు వయ్యె.

### సుగంధి.

ఓలినిం,గలంబులేడు•నొక్కగుర్వు గంధికిన్॥

వ్యా:—ఓలినిన్ = వరుసఁగ, గుర్వు = గురువు. యతి 9.

### ఉత్సాహ.

హాగణనగణములనునేడు•హత్రి పైనిగమ్ముగున్॥

వ్యా:—5వగణము మొదటియక్షరము యతి. ఇందన్నిన గణములుగాని, లేక కొన్ని హగణములు తక్కినవి నగణములుగాఁగాని యుండు. గమ్ము = గురువు.

### పంచచామరము.

చెలంగు;పంచచామరాళి•శ్రీజ,హా°,హ,హా°,హ,గల్॥

వ్యా:—యతి 10. హా° = రెండుహగణాలు. సుగంధి ప్రథమగణంబిట జగణంబుగామాఱెను.

### మానిని.

మానినికిం,భగణంబులు చెల్లుఁ గ్ర•మంబుగ నేడు;తుదంగురువున్

వ్యా:—యతి 13

### కవిరాజవిరాజితము.

న,జ,జ,జ,జా,జ,లగంబు లఁగల్గుఁ గ•సం గవిరాజవిరాజితమై॥

వ రా:—యతి 14. మానినీవృత్త ప్రథమగురువిందు రెం డు లఘువులయ్యెను. కొందఱీరెండువృత్తములకును అనఁగా మానినికి 3,5,7 గణాల ప్రారంభాక్షరములను, ఈకవిరాజవిరాజితమునకు 8,14,20 అక్షరములను సమానయతులుగాఁ దీసికొనుట సమంజసముగను.

మత్తకోకిల.

ఆరయన్,ర,స,జా,భ,రల్ గలి•యుంగఁ గోకిలయొప్పెడున్॥

వ రా:—యతి 11.

ధ్రువకోకిల

న,భ,ర,సంబులు;జా,గముల్దగు•నాద్యమా ధ్రువకోకిలన్॥

వ రా:—యతి 12. మత్తకోకిల ప్రథమాక్షరమగు గురువిందు లఘుద్వయంబాయె. దీనినే తరలయనియువాడుదురు.

మహాస్రగ్ధర.

సగణంబై తానలై పై•స,ర,ర,గలుమహా•స్రగ్ధరంబాల్పు చుండున్॥

వ రా:—యతులు 9,16. మొదటి రెండులఘువులను గురువుగా మార్చినయెడల స్రగ్ధరయగును. తానలై = రెండు తగణాలు నొక్క నగణమునై.

లయగ్రాహి

చక్క—భజ,సంబులు; మ•రొక్క—న,భ,జంబులు; నిఁ•కొక్క—స,న,భంబులును• నెక్కు—యయుగ్రాహిన్॥

వ రా:—యయు = యగణముకూడను. పైనిజూపఁబడినదంతయు నొక్క పాదము. దీని నాల్గుచరణంబులకు సమానప్రాసయుండవలయు. ప్రతిచరణంబునకుఁ బ్రాసయతులు

10,18,26 యక్షరములు. యతులుపయోగింపవు. దీనిప్రారం భాక్షరమును గురువు రెండులఘువులైనచో లయవిభాతిలక్షణ మేర్పడును.

ఇంక నప్పుడప్పుడు వాడఁబడువృత్తములను గొన్నిటిని దెల్పుచున్నాను. వానిలక్షణముం గద్యతోడరచించెద. ఉదాహరణార్థము వేఱొకవిషయముందెల్పు తత్తద్వృత్తపాదమ్ముల నొక్కటొక్కటివంతున లిఖయించెద.

1 తోదకము:-భాభగాలు. యతి 7. (విద్యకుమించిన-విత్తమ దేదీ॥

2 తోటకము:-సాసాలు. యతి 7. వినుమాహనుమా-విపులా తనయన్॥

3 భుజంగప్రయాతము:-యాయాలు. యతి 8. కృపాధామ శ్రీ రామ-కేలోన్మెత్తునీకున్॥

4 మాలిని:-నామయాలు. యతి 9. సరసిజదళనేత్రా-చారు సౌవర్ణగాత్రా॥

5 విద్యున్మాల:-మాగాలు.యతి5.ఏమీనీవా-యేమంటోయీ॥

6 స్రగ్విణి:-రారాలు. యతి 7. రాముఁడాగీముఁడా - రాట్కుమారాధమా॥

7 లలితపదము:-నజాయలు. యతి 8. అనువగుమాటల- నాడి నమేలా॥

8 పణవము:-మనయగలు. యతి6. ధీరాగ్రేసర-దితిజామిత్రా॥

9 ప్రగుణ:-సగగలు. యతిలేదు, ప్రాసమాత్రముండు. అనఘా దేవా॥

10 కుమారలలిత:- జసగలు. పైవృత్తమువలెనే. దురంబువిడ వేరా॥

వరా:—మఱియు ననేకవృత్తభేదంబులుగలవు. వల యువానిని గ్రంథంబులంజూచి మూఁడేసి యక్షరాలచొప్పున గణాలెన్నుకొని గ్రహించుపవచ్చును. ఏవేని కొన్ని పద్యముల ను నిరంతరంబుగ నల్లనేర్చిన, నూత్న వృత్తములలవాటు పడుట బహుసులభము.

# సంస్కృత సంధులు,

రామశబ్దము; అకారాంతము.

రామ + అనుజుఁడు = రామానుజుఁడు

,, + ఆకారము = రామాకారము

,, + ఇభము = రామేభము

,, + ఈశుఁడు = రామేశుఁడు

,, + ఉత్తముఁడు = రామోత్తముఁడు

,, + ఊరువు = రామోరువు

,, + ఏణము = రామైణము

,, + ఐశ్వర్యము = రామైశ్వర్యము

,, + ఓఘము = రామౌఘము

,, + ఔరసుఁడు = రామౌరసుఁడు

వరా:—ఆకారాంతము లిట్లే. మఱియు (1) "అ,ఆ (2) ఇ, ఈ (3) ఉ, ఊ (4) ఋ, ౠ (5) ఏ, ఐ (6) ఓ, ఔ" అను

ఆఱుజంటలలో మొదటి నాల్గుజంటలయందుఁ గల యాయా హ్రస్వములకు వచ్చునట్టి సంధిరూపములే యాయాదీర్ఘముల కుఁగూడ వచ్చును; గాని దీర్ఘములుమాత్ర మధికముగా నుండును. పిమ్మటి రెండుజంటలలోని యక్షరములకు సమానరూపములే. ఈసంగతి పైనుదహరించిన రామశబ్దమునందలి సంధిస్వరూపములను బాగుగాఁ బరిశీలించినయెడల విశదమగును; గనుక ఇఁకముందు గ్రంథవిస్తరభీతిచే సాధారణముగ హ్రస్వరూపసంధులనుమాత్ర ముదహరించుచున్నాను.

హరిశబ్దము; ఇకారాంతము.

హరి + అక్షము = హర్యక్షము
,, + ఇంద్రము = హరీంద్రము
,, + ఉక్తము = హర్యుక్తము
,, + ఏణము = హర్యేణము

ఁరా:—ఈకారాంతములు నిట్లే.

ప్రభుశబ్దము; ఉకారాంతము.

ప్రభు + అంతరము = ప్రభ్వంతరము
,, + ఆయువు = ప్రభ్వాయువు
,, + ఉత్తముఁడు = ప్రభూత్తముఁడు

ఁరా:—ఊకారాంతములకు నిట్టులే.

పితృశబ్దము; ఋకారాంతము.

పితృ + అభిధానము = పిత్రభిధానము
,, + ఆర్జితము = పిత్రార్జితము
,, + ఋణము = పితౄణము

వాక్ఛబ్దము; కకారాంతము.

వాక్ + అమృతము = వాగమృతము

,, + ఇంద్రుఁడు = వాగింద్రుఁడు

,, + ఉన్నతి = వాగున్నతి

ప రా:—ఈహలంతమున కచ్చుపరంబగునపుడు గకారము కకారమునకు మాఱుగా వచ్చెడిని.

,, + కాంత = వాక్కాంత

,, + గరిమ = వాగ్గరిమ

,, + చయము = వాక్చయము

,, + జనని = వాగ్జనని

,, + ఝరి = వాగ్ఝరి

,, + తరుణి = వాక్తరుణి

,, + ధాటి = వాగ్ధాటి

,, + నారి = వాఙ్నారి

,, + పతి = వాక్పతి

,, + భ్రమ = వాగ్భ్రమ

,, + మూలము = వాఙ్మూలము

,, + యువతి = వాగ్యువతి

,, + రమ = వాగ్రమ

,, + లలన = వాగ్లలన

,, + వనిత = వాగ్వనిత

,, + శాసనము = వాక్ఛాసనము

,, + సతి = వాక్సతి

,, + హరుఁడు = వాగ్ఘరుఁడు

షట్ఛబ్దము; టకారాంతము.

షట్ + అంగములు = షడంగములు

„ + ఐక్యము = షడైక్యము

సూ:—దీనికి నచ్చుపరంబైనపుడు టకారము డకారముగా మాఱి యచ్చులు నిల్చును.

„ + కావ్యములు = షట్కావ్యములు

„ + గుల్మములు = షడ్గుల్మములు

„ + చక్రవర్తులు = షట్చక్రవర్తులు

„ + జాతులు = షడ్జాతులు

„ + టంకారములు = షట్టంకారములు

„ + ఢక్కలు = షడ్ఢక్కలు

„ + తరుణులు = షట్తరుణులు

„ + ధామములు = షడ్ధామములు

„ + నముచులు = షణ్ణముచులు

„ + పదములు = షట్పదములు

„ + భంగులు = షడ్భంగులు

„ + మాతలు = షణ్మాతలు

„ + యమములు = షడ్యమములు

„ + రుచులు = షడ్రుచులు

„ + వస్తువులు = షడ్వస్తువులు

„ + శాస్త్రములు = షట్ఛాస్త్రములు

„ + సవనములు = షట్సవనములు

„ + హవ్యములు=షడ్ఢవ్యములు

మరుచ్ఛబ్దము; తకారాంతము.

మరుత్ + అర్చన = మరుదర్చన

,, + ఆవాసము = మరుదావాసము

సూత్రా:—వీనికి అచ్చులు పరంబులగునప్డు తకారము దకారమగును.

,, + కాంత = మరుత్కాంత

,, + గజము = మరుద్గజము

,, + చలనము = మరుచ్చలనము

,, + జననము = మరుజ్జననము

,, + తరుణి = మరుత్తరుణి

,, + దానము = మరుద్దానము

,, + నగరము = మరున్నగరము

,, + పూజ = మరుత్పూజ

,, + బాణము = మరుద్బాణము

,, + మార్గము = మరున్మార్గము

,, + యువతి = మరుద్యువతి

,, + రమణి = మరుద్రమణి

,, + లక్షణము = మరుల్లక్షణము

,, + వాసరము = మరుద్వాసరము

,, + శక్తి = మరుచ్ఛక్తి

,, + సముద్రము = మరుత్సముద్రము

,, + హృదయము = మరుద్ధృదయము

మనశ్శబ్దము; సకారాంతము.

మన + అంతరము = మనోంతరము

,, + ఇష్టము = మనఇష్టము
,, + ఉదంతము = మనోదంతము
,, + కంపము = మనఃకంపము
,, + గర్వము = మనోగర్వము
,, + చింత = మనశ్చింత
,, + జాత = మనోజాత
,, + తాపము = మనస్తాపము
,, + ధైర్యము = మనోధైర్యము
,, + నిశ్చయము = మనోనిశ్చయము
,, + పలకము = మనఃపలకము
,, + భ్రాంతి = మనోభ్రాంతి
,, + మయము = మనోమయము
,, + సంకోచము = మనస్సంకోచము
,, + శాంతి = మనశ్శాంతి
,, + హర్త = మనోహర్త

నానావిధ సంధులు.

రామ + ఛత్రము = రామచ్ఛత్రము
భూజ + ఛదము = భూజచ్ఛదము
వృక్ష + ఛాయ = వృక్షచ్ఛాయ
తరు + ఛేదకుఁడు = తరుచ్ఛేదకుఁడు
క్షుత్ + ఆర్తి = క్షుధార్తి
,, + బాధ = క్షుద్బాధ
వార్ + అధిపుఁడు = వారధిపుఁడు
,, + ఆకరము = వారాకరము

,, + ధి = వార్ధి

,, + నిధి = వార్నిధి

,, + రాశి = వారాశి

దుర్ + క్రియ = దుష్క్రియ

,, + ఫలము = దుష్ఫలము

,, + జాతి = దుర్జాతి

,, + లభ్యము = దుర్లభ్యము

,, + వాంఛ = దుర్వాంఛ

,, + సహనము = దుస్సహనము

,, + శకునము = దుశ్శకునము

నిర్ + హేతువు = నిర్హేతువు

పరా:—పై సర్వహలంతములకును శేషహల్సంధులు సామాన్యముగా మార్పులుండవు. కించిద్భేదములున్నను గ్రంథావలోకనమ్మునం దెలియనగు. పరిశిష్టహల్సంధులను గ్రంథబాహుళ్యభీతిచే లిఖింపఁజాలనైతి.

గద్యము:— ఇది శ్రీజ్ఞానవతీప్రముఖ గ్రంథకర్తయగు
చిల్లరిగె యోగానందకవి విరచితంబగు లక్షణ
చంద్రిక; సర్వము సంపూర్ణము.

---